# ఆంధ్రరాష్ట్రము



శ్రీనివాససోదరులు
శతావధానులు.



1940

 [వెల 0-2-0



# చిన్నమాట



ఆంధ్రదేశం పూర్వపు ఔన్నత్యం, నేటి దుస్థితి చూపించి రాష్ట్రసంపాదనానికి రాజమార్గం సూచించటానికే ఈ చిన్నపుస్తకం ప్రకటిస్తున్నాం. మా ఆశయం ఏమాత్రమైనా ఫలిస్తే ధన్యులం.

శ్రీనివాససోదరులు,

శతావధానులు.

# ఆంధ్రరాష్ట్రము.

## కృతిసమర్పణము

శ్రీరస్తు ధనశైలస్య
యద్వాస్తవ్యో రఘూద్వహః
యత్కృపాపారకూపార
శీకరః శ్రీకర శ్చితాం.

తోఁచీతోఁచని వెట్టిమొట్టిపని
యేదో చేయఁగాఁ బూని, "అ
య్యా! చేయూత" యటంచు నీగడపముం
దైనప్డు కానప్పుడుఁ
పేచీపెట్టుక కూరుచుండుటయు
పోనీ చూతమం చీవు పూ
పూచీ నెత్తిని బెట్టుకొంటయు యథా
పూర్వంబెకా? రాఘవా!

నిర్వహించినదేగద!
లేచి పెట్టినము దోషవిసరం బనుచున్,
మాచేత నగునె యేమో
నీచిత్తము వచ్చినట్టి నియమము లూనన్?

ఇందుకే యైన దోసగు పాటించబోకు
కొంచె మెచ్చైన గురుల గన్గొని క్షమింపు
మింత మించిన క్షమకు నాహార మిమ్ము
పాప మది యాకటికి నెంత బడలెనొకద!

నీకొసంగిన ఈ గ్రంథమే కృతార్థ
మగుట సందేహమే నింక నగున దేది?
పోనిలే, నీకు శ్రమయేల? పుత్రుల మగు
మాకు రాష్ట్రము నార్జించు మహిమ నిమ్ము.

మోజుపడి యాంధ్ర విష్ణుండవై జనించి
ఆంధ్రుడను వ్యక్తి యున్నాడటంచు తెలిపి
యిట్టి తనకొని ముడిసిపోకోయి! నేడు
నిలిచి మము నిల్పు టిదె గొప్ప తెలివిసుమ్ము!

# జే జే లు



తెలుగు తల్లీ! నీకు జేజేలు!
తెలుగు బిడ్డా! నీకు జేజేలు!
తెలుగు కత్తీ! నీకు జేజేలు!
తెలుగు జండా! నీకు జేజేలు!

భువి దాటి రవి దాటి దివి దాటి విధి మీటి
భువన త్రయము నేలి భూరి కీర్తుల దేలి
తెలుగు తల్లీ శక్తి దేదీప్య మానమై
తెలుగు తెలుగని సృష్టి తెగ మోగిపోవాలి!

తెలుగు తల్లీ! నీకు జేజేలు!
తెలుగు బిడ్డా! నీకు జేజేలు!
తెలుగు కత్తీ! నీకు జేజేలు!
తెలుగు జండా! నీకు జేజేలు!

# తెలుగు జండా ఇదిగో!

తెలుగు జండా ఏది?
తెలుగు జండా ఏది?
తెలుగువాడే లేడ?
తెలుగు చచ్చిందా?

లేదు లేదన రేమి?
లేదు లేదన రేమి?
భ్రమ లెందుకూ? తెల్గు
బ్రహ్మ కల్ప స్థాయి!

తెలుగు జండా ఇదిగో!
తెలుగు జండా ఇదిగో!
మిలమిలా లాడేను
మిన్నంటి ఎగిరేను!!

# అనంగనంగా.



దేశదేశమ్ములు తెలుగు శిల్పుల చేతి
ఒరవడి కై వెంట దిరుగు నాడు
అఱవలు తెలుగు గాయకులచే సరిగమ
లక్షరాభ్యాసంబు లందు నాడు
మగధ కర్ణాట సీమలు తెల్గుకవులపై
మురువు బంగరువాన కురియునాడు
దిగ్దిగంతరముల తెలుగు ఖడ్గమునకు
బ్రహ్మరథంబులు పట్టు నాడు
ఖండ ఖండాంతరాల నఖండ కీర్తి
నిలయముల గట్టుకొన్న తెల్గుల మహస్సు
ఎన్నడో కన్న కలలోని దృశ్య మటుల
మఱువగాబడెనో కో — భూ మండలమున.

మధుర మీనాక్షి సంభవ మందగ్లె మా
శిల్పకారుల కళా సృష్టినుండి
తంజాపురము స్వర్ణధామమై వెలిగె మా
కవితా సరస్వతి కాళ్లు కడిగి

ఆంబా సముద్రంబు నంజలించినది మా
జాతీయ శాసన స్తంభములకు
కావేటి రంగడు కరము లందించె మా
దుగ్గిరాలయ్య 'ఆంధ్రోహ'మునకు
అల్ల కన్యాకుమారి మా యాంధ్రశౌర్య
కావ్య గీతాల తోరణ గట్టుకొనియె
ఎఱుగకుండిన- కాదుకా దెఱుగనటుల
మనము నటియించిన- చరిత్ర మఱచునొక్కొ—!

తడియారనే లేదు తనకాళ్ల పారాణి
ప్రియు రణస్థలికి బంపెను నవోఢ
పదనుమాటలు తాపి పసుపుముద్దలతోడ
పతికి తన్మత్రాణ మతికె పత్ని
పేరు నాయకురాలుగా రాజ్యచక్రంబు
కనుసైగలో త్రిప్పినది ప్రౌఢ
విరిగిన పాలతో తరుగని శౌర్యాగ్ని
కల్పించె సుతునిలో కన్నతల్లి

ఇట్టివె యనర్ఘరత్నా లనేకములుగ
మన తెలంగాణమున దొఱకినవిగాదె?
సందియంబేల? నేటికి చావలేదు
చావలే దాంధ్రరమణి ప్రజ్ఞా ప్రశస్తి.

ప్రబల తర్క-వ్యాకరణ వారిధి మథించి
కావ్యామృతము పంచె కలికి 'నాచి'
కుమ్మరి సారెలో కమ్మని భావముల్
మెదిపి రూపముతీర్చె మొలత 'మొల్ల'
జయదేవు దివ్యప్రణయ సృష్టికిని క్రొత్త
మురిపెముల్ దిద్దెను 'ముద్దుపళని'
సంకుచితములైన సంఘు దృష్టులకు వి
శంకటత్వము గూర్చె 'వేంకమాంబ'
చెరిగిపోలేదు తెల్గుసుందరులు సంస్కృ
తాంధ్ర వేదికలను తీర్చినట్టి ముగ్గు;
లలితకళ లన్నియును మనచెలుల సొమ్ము,
నాడు చదువె లేదందు మీనాటి మనము!

మన స్కందవర్మ కంచిని కాపురముపెట్టి
వ్యవసాయ శాస్త్రంబు నప్పగించె
మన త్యాగరాజు చెప్పెనొ లేదొ సరిగమల్
కుడిమియామల వ్రాత లుడుగలేదొ
మన మంత్రితిమ్మరుసు మాటయే జాతీయ
నాగరికతకు పునాది వేసె
మన తంజపురిరాయ లెన లేని సాహిత్య
విజ్ఞాన రత్నాలు విలిచి యిచ్చె

[illegible] సోదరులకు మన యాంధ్రులెల్ల
[illegible]ట్టి నిక్షేపములు కూర్చి యిచ్చినారో
[illegible] ప్రణయ భావ మైన దలచి
మనసు కలుపరో మన యుద్యమంబుతోడ.

[illegible] ప్రాణాపాట మన యాంధ్రకవితకు
మెఱుగు బెట్టిన గౌతమీ స్రవంతి
నాటి మాధవవర్మ న్యాయైక దీక్షను
కెరటాల దాచిన కృష్ణవేణి
పలనాటి బిడ్డచే పౌరుషం బుగ్గుగా
గుటుక వేయించిన గుండ్లకమ్మ
రాయలసీమకు రతనాల పంటల
తొడుగు కైసేసిన తుంగభద్ర

[illegible] ముఖలింగమూర్తి నాగావళికిని
పాలకడవల నందిచ్చు వంశధార
కలవు, లోటెద్ది? భూదేవి చలువ జేసి
అనుభవించెడి గీతయే యబ్బవలయు.

అప్పాజి అప్పాజి యనెడి శబ్దమ్మె మా
ర్మ్రోలుకు రాయల హజారమ్ములెల్ల
[illegible]త్తి శ్రుతికల్పుకొనును పెంజేరాన
తొణుకు గీతికలతో తుంగభద్ర

రామలింగని హాస్యభూమికా వైచిత్రి
నెమరువేయును గోపురమున చిలుక
సరిగమపదనిస స్వరకల్పనము సేయు
నా విఠోబాల్యాన త్యాగరాజు

శిథిలమైకూడ హంపీ విశిష్ట శిల్ప
మింతమాత్రముగా కళ్ళయెదుట నుంట
ఈ విశీర్ణాంధ్రహృదయాల కెల్ల కొంత
స్వాప్నిక సుఖానుభవమైన సంఘటిల్లు.

శ్రీకాకుళము చెట్టుచేమలు ప్రసవించు
నాంధ్రవిష్ణువు ప్రాజ్ఞహాస్య లెల్ల
గౌతమి యిసుకలో కడలేని చవులూరు
చాళుక్యనృపతి విజ్ఞాన మధువు
పలనాటిబండలు తొలిచిన వెలుగొందు
బాలచంద్రముల ఖడ్గాల మణులు
ఓరుగంటి త్రిసంధ్య లొడ్చిన వెలుగొందు
కాకతీయ ప్రతాపు కంటిమెఱుపు

కొండవీటి కత్తులబావి నెండబెట్ట
బెటబడు రెడ్డిరాజుల ప్రాభవంబు
సంశయంబేల నేటికి చావలేదు
చావలే దాంధ్రజాతీయతా విభూతి!

కావ్యవాహిని కౌనకట్ట కట్టి బుధాళి
మనములు పండించె మల్లినాథు
హొత్తరాహుల కైన నమరావతిని విద్య
గరపె నాప స్తంబ వరమనీషి
గణితశ క్తి ఖగోళమునకు చక్కని రాచ
బాట నిర్మించెను భాస్కరుండు
వాగ్గేయ కారకత్వమున నాదబ్రహ్మ
మఱచేత నిడికొనె త్యాగరాజు

పేర లెల్లరు నాంధ్రకుమారులెకద!
ఖండ ఖండాంతరాల ప్రఖ్యాతి గనరె?
నేటి దౌర్భాగ్య మేమొ ఎంతేసి ఘనులు
ముందునకు రారు- ఆంధ్రులై పుట్టినంత.

భరతనాట్యపు కళాభంగిమమ్ములు క్రొత్త
క్రొత్త తీరుల నచ్చుగ్రుద్ది రొకట
అలనాటి తెల్గుమల్లుల సాముగరిడీలు
రథములతోగూడ వ్రాసి రొకట
దుక్కిటెడ్ల బలంబు తూర్పారబట్టు రై
తుల నిత్యజీవిక తొలచి రొకట
రాలె దూలములు స్తంభాలు పైకప్పుగా
మంటప హర్మ్యముల్ మలచి రొకట

ప్రకృతిజన్యములౌ కొండపలకలెల్ల
తీరుగా దిద్దినాకెట్లు తెలుగుశిల్పి?
తనదు సిద్ధహస్తములె యంత్రాలుగాగ;
స్వాత్మభూతి విద్యుచ్ఛక్తి యయ్యెనేమొ!

తనదానధార సల్పిన వారినిధి వీచి
కా విహారమున భాస్కరుడు సాక్షి;
తనమనీషయె ముక్కంటాడయ్యె రాజేంద్రు
లెల్లర కని చెప్ప ఢిల్లినేత;
తనకనుసైగయే తరలి సూయాణమై
పోయె నా పాటలీపుత్ర మూడె;
తనపిచ్చిగీతయే యనిత రానల్ప శి
ల్పం బయ్యెనన గుహాప్రతతి కలదు;

తనప్రబోధంబు లోకావతంస మనగ
నమరు నమరావతీ సతీర్థ్య యగు కృష్ణ
తీర్పరులలోన మొనగాడు తెలుగునాడు
లేదు సందేహ మిసుమంత లేదు లేదు!!!

గౌతమీనది వీచికాడోలికల స్వయం
వ్యక్తయయ్యెను నన్నపార్య మణికి,
తిక్కనకవివాణి చిక్కని తెలుగుతో
ఉగ్గుపెట్టుచునుండ ఒళ్లుచేసె,

తాతయ్యపై ప్రాకి తగని గారామున
క్రిష్ణరాయల పల్లకీ గడించె,
తిరుపతి వేంకటేశ్వర సమాదరమున
నేనుంగునెక్కి యూరేగ బోయె,

నవ్యసాహిత్య రంగమ్మునన్ స్వతంత్ర
వివిధ వర్తన నర్తన వివశయయ్యె,
విశ్వవాఙ్మయ సువిలాస వీథు లెల్ల
తెలుగు ముత్తైదువను జూచి తెల్లబోయె.

అక్కన్న మాదన్న లాబోరు దక్కింప
నిక్కి పేరెక్కిన చక్కనమ్మ
పోతన్న కైటభారాతి కోడలికి క
న్నీరు వారించిన నీతిసీమ
గోపన్న బాకీ అణాపైసలును దేవ
దేవుండు తీర్చిన దివ్యభూమి
బసవనాయకు కరవాడి కటారి సి
కారుకొట్టిన పరాక్రమవనమ్మ

నేడు నైజాము పాలించు నేలయందు
బహుళ భాగమ్ము తెలుగుల పాతయిల్లు,
ఆ సముద్రమ్మునందు ననర్ఘ మణులు
పాతుకొని యుండెరా చూచువారు లేక.

అమృతాంజనముతోడ నాంధ్రపత్రిక నిచ్చి
తలనొప్పి బాపిన ధన్యతముడు
ప్రేమ గళాకుమారికి పెండ్లియిల్లు దు
ర్గామందిరము నిడ్డ రసికతముడు
విశ్వ నాథుడుగాక విశ్వ దాతృత్వంబు
దక్కించుకొన్న వదాన్యతముడు
గీతామృతము చుక్క క్రిందబోనీక జీ
వితపాత్ర నింపిన విమలతముడు

సంఘసంస్కార శకటైక చక్ర మగుచు
హరిజ నోద్ధర్త యైన నిస్స్వార్థతముడు
కాశినాథునివారి నాగేశ్వ సూరి
నాదు సోదరుడన్న ప్రాణాలు వడకు!

చీరాల పేరాల చేనేత వస్త్రమ్ము
లిందు నందన కెందు గ్రందుకొనియె
కొండపల్లి జనమ్ము కొత్తకొత్త రకాల
చెలువంపు బొమ్మలు చేసిపోసె
కోనసీమ తయారు కొమ్ముదువ్వెన కార్మి
కులతోడ ప్రజల చిక్కులను దీర్చె
ఏటికొప్పాక సృష్టించిన చిత్రాలు
సీమలోగూడ ప్రసిద్ధి పొందె

మోటుపలి రేవు కస్తూరిముద్ద యయ్యె
వాడరేవును గొలిచె జావాదికంబు
హంపిలో లేని వొకరత్నమైన లేదు
ఇపుడో- కన్నీరు లేదు దుఃఖాంతమున్న!

ఆదివిష్ణువై యవతార మందె ననుచు
అనుకొనిన రామచంద్రునకైన లేని
ఘనత యొక మన శాలివాహనున కబ్బె
నుబవరాని దిదే ఆంధ్రచరిత్రలోన!



# ఆంధ్రాష్టకము!



బెంగాలీ ప్రేమ లేకుంటే
కలం కదను తొక్కదు,
హిందీట్యూన్సేవి దోపందే
సినిమా అచ్చకెక్కదు.



ఏ 'దత్తో', 'చందా' పెట్టందే
పేరు గౌరవ పాత్రమా?
బెంగాలీ లాల్చి పైజామా
లేనివాడు మనుష్యుడా?

శాంత ఆప్టేయె మా రంభ
సుభాషే మాకు దేవుడు
మావాళ్లు వట్టి డవ్వాలు
మాకు గిట్టరు గిట్టరు!!



అందమైనది హిందీయే
తెలుగా? తెగులా ఇది?
మాతృ భాషైతె ఏమయ్యా?
ఎప్పుడూ అమ్మ చావదా?



సుందరయ్యరు సాంబారు
సర్వపాప వినాశనం;
మరాటీల చపాటీలు
భలేరుచి భలేరుచి!!

అడియేను ద్రావిడస్వామీ!
నొమొష్కార్ బొంగొబాసికి,
ఆదాబరజ్ ముసల్మాన్‌భాయ్!
ఆంధ్రులం మేము ఆంధ్రులం!!



“క్యాహైజీ ఆంధ్ర కహ్తేతో?
ఆంద్రా ఎన్గిఅ ఎన్నదు?”
ఎందు కీప్రశ్నలన్నీని?
చూళ్లా? ఊసరవెల్లిని.



ఇది ఆంధ్రాష్టకం, దీన్ని
పఠించండి త్రిసంధ్యల;
ఆంధ్రత్వం పూర్తిగా మీకు
అబ్బుతుంది నిజం! నిజం!!

# బాపురే తెల్గుకుఱ్ఱడా!



ఆంధ్రపత్రిక జూడ నమృతాంజనమ్ము కా
వలె, 'మెయిల్' మనకు రంభాఫలమ్ము
కోడెరాముని నెత్తుకొనిన నామర్దా గ
దా? 'గామ' మన పెద్దతెగ్రితోసగు!
తెలుగు నేర్చుకొనంగ తీరిక లేకుంట
హిందీ బెంగాలి పఠింతువుగద!
తిరుపతికవులన్న తెలిసికో వెవ్వారో
అల ద్విజేంద్రుండు పెద్దన్న మనకు,

కాశికృష్ణ మనీషి సంగతి గ్రహింప
బోవు భండార్కరుకు దాసభూతుడ వయి
బాపురే! తెల్గుకుఱ్ఱడా! పనికివచ్చు
కళలె యన్నియు మనయొద్ద గలవుగదర!

ధర్మవరమువారి దలపనేరవుగదా
షేక్స్పియర్ మదిజొచ్చి చిందులాడ,
కవిసార్వభౌముల గణుతింపలేవుగా
అల రవీంద్రునకు నీ ప్రాణమిచ్చి,

*శివశంకరుని పేరు చెప్పుకోలేవుగా
కోట్రిడ్జిమోజుతో కొట్టుకొనుచు,
రాఘవాచార్యుల ప్రతిభ మెచ్చవుగదా
చంద్రమోహానుని హ_స్తముల జిక్కి,

†గూడవల్లి, వై. వి. రావుల గోడుదలప
వశటు! శాంతరాముసు మఱి హాలివుడ్డు
లోని హైరెక్టరులు నిన్ను లోగొనంగ.
నీ కు గుణలోలుపత్వంబు నిండుకొనియె!

•

నెత్తిజర్మనికాని విలువ యేమున్నది
కాశికృష్ణుని వచః కల్పనముల?
బ్రిటనుపిచ్చియెకాని అటనేమి సరకుండె
ఈప్పుగంటిని పిలిపించుకొనియె?
ఆక్స్ఫర్డు వెనుకచూ పభిశంసనీయంబె
సర్వేపల్లిని గొల్చు సమయమందు;
గ్రుడ్డిలోక మ్మెదో కూసె కాంచనామాల
నూాంఫరల్ అన నేమియున్న దచట?

ఇన్ని యే వంగదేశికో యున్నయెడల
అది మెరిట్, అది ట్యాలెంటు, అదియె సౌండు
బాడ్డు ప్యూ, అది సౌందర్య పారమార్థ్య
మింత తెలిసిన నీబుద్ధి ఎంతదోయి!

---

* తల్లావఝ్ఝల శివశంకరశాస్త్రి † గూడవల్లి రామబ్రహ్మం.

తెలుగుబిడ్డల నోరు
తెగ కోసిపోవంగ
వేసినా అంచనాల్
వేసినట్లే ఉండ
అఱవ ప్రాజెక్టెల్ల కావా?
మా తెల్గు
కఱుకు కండలు కరగి పోవా?

చెడుపురుగు పట్టింది
చెట్లన్ని కొట్టింది
చూపుల్లు చల్లగా
చూస్తామొ చూడమో
తెలుగుతోటా మళ్లి పూచీ!
ఇక ఫలం
తెలుగువాళ్లా నోటి కందీ!



# కళ్ళు తెరుచుకోలేవా?



నీసొమ్ము నీప్రజలు నీకు కాకుండా
నీ దేశ మింతైన నీకు లేకుండా

విరుగు తరుగులతోటి
కరిగిపోతూ ఉంది

తెలుగుబిడ్డా! కళ్ళు తెరుచుకోలేవా?
సీమల్లో మనగీత చెరిగిపోయింది
మనయిల్లె మనపేరు మఱచిపోయింది

వెనకెపుడో మాబాగ
వెలిగిఉంటే ఏమి

తెలుగుబిడ్డా! కళ్ళు తెరుచుకోలేవా?
ఉత్కళంబని కొంత ఊడిపోయిందీ
నైజాముకని కొంత నడిచిపోయింది

మదరాసు నఱవలూ
మంగళం చేస్తారు

తెలుగుబిడ్డా! కళ్ళు తెరుచుకోలేవా?

# ఉలికి రావేమి?



కొంప లంటుకపోయినగూడ నిటుల
నూరకే నిద్రపోవుచునుంటి వేమి?
లేవవోయ్ తెల్గుకుఱ్ఱడా! లేవవోయి
ఉలికిరావేమి రంగాన కుర్కి యదర?

ఏడుకొండల దేవు డెత్తు కెత్తుకు తమిళ్
సోదరుండట! వారిసొత్తె యంట!
తెల్లారిదాక గణించుకున్నాడంట
వారి ముత్తాత యెవ్వండొ కాని!
తావులేదట తెల్గుతల్లి నిల్వగ చెన్న
పురములోపల సూది మోపినంత!
ఆంధ్రరాష్ట్రోద్యమ వ్యాఖ్యాత లందఱు
కులకషులను బెంచు కూళలంట!

మాయలపకీరులై గట్టివాయితనము
చూపుచున్నట్టి ద్రావిడ సోదరాళి
ఱంకె యొకటేని చెవిని జేరంగలేదా,
చెవులు చిల్లులుపడియెనో చెప్పుమాంధ్ర!

# నిన్నెవ్వ రాపలేరీనాడు



నిన్నెవ్వ రాపలేరీనాడు
నీఘాక కోపలేరీనాడు

కళ్లు తెరిచేవంటె
మన్నుమిన్నూ వడకు
పలుకు పలికేవంటె
బ్రహ్మవాక్కే యౌను॥ ని॥

అణువలే కాదురా
ఆ దేవదేవుడూ
నీ చెప్పుచేతల్లో
నిలిచిపోతాడురా॥ ని॥

తెలుగుకత్తీ మళ్ళీ
తళతళా లాడాలి
తెలుగుతల్లీ మళ్ళీ
దేశాలు ఏలాలి॥ ని॥

# దివిగూడ మ్రోగుచుండె!



పానుగంటి విభుండు స్వర్గాన కలవరిం
పగ రంభ గాభరాపడుచునుండె;
మోచర్ల రామన్న ఖేచరుండై యుండి
ఎపుడెప్పుడని నిరీక్షించు చుండె;
*వేదము విబుధుండు విధితోడ తత్కృతా
న్యాయానకై తగవాడు చుండె;
†నారసింహుని యుగ్రతారూఢి బెగడొంది
దేవతాళి విధాత దెప్పుచుండె;

భువినె గాకుండ దివిగూడ మ్రోగుచుండె
సత్యమావు నాంధ్రరాష్ట్ర నీరంధ్ర వాంఛ,
విజయవేళా సమారంభ విధము దోచె
లేవహోయ్ తెల్గుకుఱ్ఱడా లేవహోయి!



* వేదము వేంకటరాయశాస్త్రి. † చెరుకువాడ నరసింహంపంతులు.

# మద్రాసు మాది

మా మాదరాజు నామమున మద్రాసు స
మాఖ్య చెలామణీ యగుట గనరో!
చెన్నప్ప పేరున చెన్నపట్టణ మంచు
బిలువంగ బడుటయు దెలియలేరో!
పెద్దినాయనిపేట పెద్ద గొంతుకతోడ
జెప్పెడు సాక్ష్యంబు చెవిని బడదో!
జెంటూలె యాంధ్రులు జెంటూటవునె నేటి
జార్జిటౌ నన్న ప్రశంస వినరో!
అన్నియును మేము కల్పించినట్టి వనుచు
కొట్టివేయంగ రానివై కూరుచుండె
ఆంగ్లవిరచిత శతసహస్రానవద్య
పుస్తకాభేద్యదుర్గ సమూహమందు.

మాదని ఘోషింపంగనె
ఏదో మోసంపువ్రాత సృష్టింపగనే
పోదయ్యా తెలుగుహక్కు, వి
వాదము సాక్ష్యములె తేల్చివైచెడి; తమిళుల్!

# కాంగ్రెస్ ఆంధ్రులు

పట్టాభి నెదురించి పల్కగా దమ్మున్న
దా ఏ మహాత్మున కైనగాని?
ఆంధ్రకేసరి గన్న హడలెత్తి పోవవే
ఎంతటి అపరదిగ్దంతు లైన?
గద్దెరంగయ్య యాగ్రహామునుందఅ నేమ
హాశక్తియైన జోహారు లిడదె?
వేమవరపువారి విజ్ఞాన భానుండు
చిత్తమూడ్చదె మాఱుచెప్పవారి?

వీరలందఱు కాంగ్రెస్సు ప్రాపుక్రింద
నడగియుండిన శతమున నాత్మశక్తి
నొక్క లవలేశమును జూపకున్నవారు;
వీరలందఱు మన దుముదారుదోరలు.

అతడు లోపల నంత కైదువేశ్లెట్టు లు
న్నాడుగదోయి 'కొండా' మనీషి
వేయిమందికి జవాబీయగా గలడురా
ఏమనుకొంటివి? కాళేశ్వరుండు

కార్మికావళికి నిక్కంపు చుట్టంబురా
సామాన్యుడా గిరి సత్తముండు?
చిన్నవా డనుకోకు చిచ్చఱపిడుగురా
పరికింపవోయి! గోపాలరెడ్డి

కోటిరెడ్డి, తిర్మలరావు, గొట్టిపాటి
ఇంక నెందరో గణియింపుమీ! యనన్య
శౌర్య ధుర్యులు, బుద్ధివైశాల్య కల్యు
లింతకును వీరు నీయన్న లేసుమయ్యా!

గణనాతీత మహామహః ప్రకృతితః
కల్యాణ కల్యాణమై
ప్రణు తానేక వివేకపాకమధుర
ప్రజ్ఞాఫలౌక స్వమ
ర్పణా సంరంభ విజృంభణం బయిన
ఆంధ్ర ప్రత్నవృతుంబు ప్ర
త్యణువున్ కాంగ్రెసుపుర్వు పట్టితొలిచెన్
వ్యర్థీకరించెం గటా!

కాంగ్రెసన మాకు ద్వేషంబుగాదు గాని
దానివలన నాంధ్రులమీద పూనియున్న
పెనుపిశాచంబు చేష్టలు కనులగట్ట
నేటి కిటు లఱకాల్మంట నెత్తికెక్కె!

# కాంగ్రెసేతరాంధ్రులు

తనయుచ్ఛ్రయముతోన తనకీర్తి వంతులు
పెట్టుకోనెదిగిన విజ్ఞమూర్తి
తగ నిదంబ్రాహ్మ్య మిదంక్షాత్ర మను దివ్య
మతివిక్రమము గల్గు చతురతముః
పరుల కంపని సంస్థ బెడసి కన్నెఱ్ఱగా
ధాటి వాటించు నుద్దాంతబుధులు
కృష్ణరాయల నుటంకించు నకించి ద్య
శఃకీర్తి భర్తయహా క్షాత్రకేసరుః

వీర లెవరోయి? మన తెల్గువీరులోయి
తెలుగు గనినుండి వెలువడ్డ తీరుతీరు
మణులు, సర్వేపల్లియు, కట్టమంచి, కూర్మ
ఈమ్మగంట్లును, చల్లపల్లీశ్వరుండు.

అల ధర్మరాయని యాంధ్రవైశారద్య
ముపయోగ పడుచుకోవోయి నేడు:
బాపిరాయని కళాప్రాభవం బెల్లనీ
సొంతసొమ్మై, లెక్క చూచుకొమ్ము:

బొబ్బిలి ధరణీంద్రుడు దెబ్బపోటరితనం
బక్షయ శ్రీరామ రక్షయోయి;
విశ్వేశ్వరయ్య నీ పెద్దన్న యన్న గ
ర్వింపవేమోయి కొండెత్తు గంతి;
వీర లంకజునూజె నీవారలన్న
ముదముతో దేహ ముప్పొంగిపోవుగాదె?
ఘనుల గౌరవించుట నేర్వవోయి,
ఎందుకోయి బంగాళీలు హిందువారు?

అందఱు నతిరథులే కా
కిం దొంగొక యర్ధరథుని నెంత వెదకినన్
ఎందాక వెదకినను గన
మిందే కనవోయి ఆంధ్రి సృష్టి చతురిమన్.



# రాయలసీమ



మానంబు పండిన మంచి మాగాణి
జ్ఞానామృతము గన్న ఘన సాగరమ్ము
సిరి చాపలమ్ము తీర్చిన భిషజ్మౌళి
ప్రబల నీరంధ్రమ్ము పశ్చి మాంధ్రమ్ము.

కృష్ణ రాజ్యము వెలింగిన దీపకళిక
వేదభాష్యము ప్రసవించిన తల్లి
తెలుగుకన్నియ సిగ్గు తీర్చిన ప్రోడ
ప్రబల నీరంధ్రమ్ము పశ్చి మాంధ్రమ్ము.

ఆక్స్ఫర్డు శుశ్రూష లందిన మేటి
ఆంధ్రీ పదన్యాస మమరించు మేటి
స్వ కళాప్రపూర్ణత జాటిన మేటి
ప్రబల నీరంధ్రమ్ము పశ్చి మాంధ్రమ్ము.

కారణమే లేని కంగారు పుట్టి
అక్కఱలేదు మా కాంధ్రరాష్ట్ర మని
ఆటగాయ తనంబు నగుపింప జేయు
శిష్టు లున్నారన్న సిగ్గు సిగ్గయ్యో.

మనల నందఱను కమ్మని జానుదెల్గు
ఒకగాట నడిపించు చుండగా నింక
ప్రాక్పశ్చిమ విభేద భావముల్ మనము
పెట్టుకొన్నవె కాక వేఱేమి కలదు?

ఇన్నాళ్ళనుండియు చెన్నరాష్ట్రమున
ముగ్గుగా అఱవల మోచేతి గంజి
తుంగభద్రను పేరి దొరసినదొక్క
ఆనకట్టయి? వట్టి అడియాస లేల?

మన సోదరులలోనె మనకు నమ్మకము
లేదన్న పెరవారు లేవిడీ యనరొ?
పొరుగింటి పుల్లకూర రుచెక్కు వన్న
సామెత కేల లక్ష్యమ్ము లయ్యెదరు?

తెలుగుజండా పట్టి తెలివి చూపెట్టి
అఱవవాదము మట్టి ఆంధ్రులై గిట్టి
కడుపు అంపపుకోత కష్టాల మోత
తప్పింపుడయ్య సోదరులార! మాకు.



# విశ్వవిద్యాలయము

వేళే వచ్చిందీ
మాకూ
వేళే వచ్చిందీ
పేరుకి విశ్వా
విద్యాలయము॥వే॥

పరభా పెచ్చిందీ
తెలుక్కి
పక్కలు విరిచిందీ
విరులా నవ్వులు
పక్కలో బల్లేల్॥వే॥

భేదాల్ తెచ్చిందీ
మాలో
వైరాల్ పెంచిందీ
తెలుగూ తెలువులు
తెల్లా వారేయ్॥వే॥

# ఆంధ్రమహాసభలు



ఎన్నాళ్ళమ్నా ఆంధ్ర సభలు
ఎంతల ఎంతల ఆంధ్ర సభలు
కడుపులు నిండిన కమ్మని తిండ్లు
కన్నులు నిండిన కళల దండ్లు
కోటలు దాటే పాటలు మాటలు
మూట కట్టినటు మురుపులు మెఱపులు
అంతుమాలిన ఆరాటమ్ములు
పొంతచుక చచ్చే పోరాటమ్ములు
చేరిక లేని చేట భారతాల్
తీరిక లేని తీర్మానమ్ములు
పదమదమై పయి సద్దుమణిగెడి
స్థాయీసంఘపు సభ్యుల ఎన్నిక
ఎక్కడిదొంగా లక్కడే ఇక
ఇదిగో అదిగో ఆంధ్ర రాష్ట్రం!

# ఏం చెయ్యాలి?



కాంగ్రెసేతరులతో గలసి వర్తింప నా
క్రీడుకే యిది వ్యతిరేక మనుచు
ఇతడు కాంగ్రెసుమెంబ రితనితో గలియ నా
యాత్మగౌరవ మడుగంటు ననుచు
పశ్చిమాంధ్రునిబుద్ధి పడమట బట్టె నా
కితని సంబంధ మెట్టు లనుచు
పూర్వాంధ్రు డీతండు పోకిళ్ళమారి నే
విశ్వసించుట యెట్లు పేని ననుచు

భిన్నభిన్న భావాలతో భిన్నభిన్న
మగునటుల జేయబోకుడీ యాంధ్రశక్తి
ఆవు నావును తన్నుకలాడి నడుమ
దూడకాలిని విరుగంగ ద్రొక్కినటుల.

రూపుమాసినది తెలుంగుమేడ కనుండు
వెల్లవేయ రిదేమి వెధవగుణము?
పగిలిపోయినయట్టి ప్రాతదూలాల్ తీసి
కొత్త దూలమ్ములు నెత్తరేమి?

కోటలు పడిపోయినట్టి గోడలవంక
కన్నెత్తి చూడ రీ కర్మ మేమి?
వ్రయ్యలైనది మెట్లవరుస అట్లే యుంచి
దిక్కులుచూతు రీ దీన తేమి?

అర్హతను గాంచి, మంచి నాయకుల నెంచి,
సేనలను కూర్చి, చక్కని దారి తీర్చి,
సింహ రంహోయి ఆంధ్రులారా! బిరాన
వినబడుటలేదె మన తల్లి పిలుచుచుండ?

సైరంధ్రమ్ము రణమ్ము సేయు టొకటట,
నిర్మాణ కార్యక్రమం
బారంభింపు టొకంట దేహ సుఖమం
దాసల్ నివారింపుడీ
శూరోత్తంసులు మీదు దిగ్విజయ మీ
శుండేని మారోడ్డశే
కీర్తిశ్రీ విజయాంధ్రగీత మమరీ
ప్రేయఃపదం బందెడున్!

నూటి కిన్నూరు తెన్గునకు ప్రాధాన్యంబు
యూనివర్సిటి నుండు టోర్వరాదు
తెలుగుగ్రంథాలయమ్ముల వేయి కొక్కటి
తెలుగుపుస్తక ముంట కలుషకరము

## ఆంధ్రరాష్ట్రము

తెలుగుపంతుళ్ళకు తెగ జవానులతోడి
సరి జీతమిచ్చుట చాల లోటు
తెలుగులో పుస్తకాల్ గిలికి బెంగాలి వ్రే
లిడి చూపు కవులుంట యెంతో తప్పు!

ఆంధ్రపుత్రుల పూజ్యులం చరసికొనుట
పాపముల నూటికిని నూరు పాప మగును
దీని భావమ్ము నెఱిగి వర్తింపుమయ్య!
ఇదియె నిర్మాణ కార్యమోయీ! కుమార!

పలనాటి పల్లెబండలనుండి శౌర్యపు
తడి బాలచంద్రులు పిడిచికొనిన
కాకతిరుద్రమ్మ కడగంటి మెఱుపుతో
వెలదులు కుంకుమ పెట్టుకొనిన
తిమ్మర్సు బుద్ధిలో కొమ్మువేసిన యుక్తి
నాయకుల్ మనసుల నాటుకొనిన
దేశభాషలకెల్ల తెలుగె లెస్స యటన్న
మెలపు దేశము కూడబలుకుకొనిన

చేవగల్గిన చాలొక్క చిటుకలోన
నాంధ్రరాష్ట్రము సాధింప నగును మనకు
దేశ చరితలో తొల్లిటి దివ్యపదము
నందుకోగల దీ యావ దాంధ్రజాతి!

ఈపద్యమును 30 వ పుటలో రెండవదిగా చేర్చుకొనవలెను:—

అంతర్వాహిని రైతుజీవనది
పుణ్యస్నాన యోగ్యమ్ముగా
పంతంబూని వెలార్చి కాంగ్రెసు మహా
వారాశిలో జేర్చి ఆ
శాంతశ్రాంత యశఃప్రకాశుడగు
నాచార్యుండు 'రంగా' యనన్
స్వాంతం బెంతయు పొంగిపోయెడిని
తద్భ్రాతృత్వ గర్వంబునన్.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 6 | 14 | సైగలో | సైగలోన |
| 19 | 19 | బాడ్డు | బ్రాడ్డు |
| ” | 20 | మ్రింత | మింత |
| 21 | 5 | ఇంతినైనా | ఇంతనైనా |
| 39 | 19 | రాష్టము | రాష్ట్రము |